# పరిచయం

## కాన్క

"పుష్పించే జనప పొలం-పక్క నించి,
వెళ్ళే సన్నని దారి మీదిగా, వెళ్ళావు.
నిన్న రాత్రి నేను నీ జుట్టులో
పెట్టిన పూల దండ వొదులుగా
అక్కడే వేళ్ళాడుతో వుండడం చూశాను.
నా చివరి కాన్కగా ఇయ్యడానికి
పొద్దున్నే కొత్త పూలు ఏరి తెచ్చిందాకా,
నువ్వు ఎందుకు ఆగలేదు!"

అని క్రిష్ణారావు చదువుతున్నాడు
. అందమైన ఉదయం — చలం, సౌరిస్ సమక్షంలో-
ఉదయపు లేఎండ వారి పాదాల దగ్గిర పరుచుకుంది.

అదే సమయానికి తోటలోనించి
పువ్వులు కోసి తెచ్చిన క్రిష్ణ, రాత్రి పక్కమీద పెట్టిన పూలు
సౌరిస్ జుట్టులో చిక్కుకుని వుండడం చూసి పక్కున

నవ్వింది; సందర్భానుసారంగా, అర్థయుక్తంగా-ఆ నవ్వు
లోని అంతర్యం తెలిసి అందరూ నవ్వుకున్నారు.

అదంతా ఓ సుందర దృశ్యం-

శారీరక అశక్తతతో చలం స్వయంగా రాయలేక, క్రిష్ణారావు చేత రాయించిన ఈ ప్రేమ గీతాల్ని ప్రతి ఉదయం సౌరిస్‌కి చదివి వినిపించేవారు. అవసరమైన చోట్ల ఆమె వాటిని సవరించే వారు.

ఈ గీతాలలో వర్ణించినట్లే పువ్వు చెట్లని, పిట్టల్ని, నీలాకాశాన్ని, లేఎండని, కలువు లోంచి చూస్తో రంగు రంగుల వాజుల్లో రక రకాల పువ్వుల్ని అమరుస్తో, టాగూరు "కాన్క" కవితా మాధుర్యాన్ని, అందాలని, సంగీతాలని, సౌందర్యాలని, వర్ణించి చెప్పేవారు సౌరిస్.

ఒక్కొక్క గీతం క్రిష్ణారావు చదివే వార చలం, సౌరిస్ ఆ భావ సౌందర్యానికి, మనోహర గానానికి, అనంత మాధుర్యానికి, తాత్విక గాంభీర్యానికి, ముగ్ధులై వాటినే తిరిగి తిరిగి పారవశ్యంతో తలుచుకుంటో హృదయ నిశ్శబ్దంలో "మ్యూజ్" చేసుకుంటో తన్మయులై భగవాన్ శ్రీ రమణ మహర్షి ఎదుట మౌనంగా కూర్చుండి పోయేవారు-ఆ రోజులు అందంగా, ఆనందంగా గడిచేవి.

ఈ గీతాలలో పల్లెల సౌందర్యం, మల్లెల సౌరభం, సెలయేళ్ళు, నీలాటి రేవులు, కొబ్బరి



తోపులు, గొల్ల పడుచులు, జోల పాటలు, చల్ల చిలికే చప్పుడులు, పాలు పితకడాలు, రాట్నం తిప్పే ముసలమ్మ రాగాలు, పడుచు వాళ్ళ తేరింతలు, బల్లకట్లు, సంజ వెలుగులు, పావురాల మూలుగులు, గోధూళి, చిక్కబడుతున్న నీడలు, గానంతో పులకరించే దక్షిణ మారుతాలు, వాన మేఘాలు, మిణుగురులు, వసంత కుసుమాలు, పైడి వెన్నెల రవళులు, మేలిముసుగులు, పరిణయ తల్పాలు, ఆడే పావడాలు, కంపిత పత్రాలు, పంట పొలాలు, ఎగిరే పిట్టలు, గంతులేస్తోన్న మేక పిల్లలు-సహజ సౌందర్యంతో కమనీయంగా వున్నాయి.

ఈ గీతాలలో సమస్త సౌందర్యాల్ని, నిత్య సత్యాల్ని అద్భుతంగా చిత్రించారు టాగూరు.

సౌందర్యోపాసకుడు అయిన చలంలోంచి సహజంగా, స్వచ్ఛంగా పలికాయి అనువాదాలు. అందుచేత ఈ గీతాలు చదువుతోంటే టాగూర్ బెంగాల్‌ని వర్ణించినట్లు స్ఫురించదు: చలం ఆంధ్రదేశాన్ని వర్ణించినట్లు అనిపిస్తుంది. ఆ నేల, వాసన, అందం, వర్ణన అంతా తెలుగుదేశం, తెలుగుతనం___

టాగూరు ఎంత సహజంగా రాశారో అంతకన్న సహజంగా, అందంగా, అనువాదం జరగడంతో ఈ గీతాలు చలం సొంత మనిపిస్తాయి-

"ఈ అనువాదాలు తాను చేస్తే
రాయకపోవడం పెద్ద లోపం అనుకుంటాడు నాన్న. కా
అట్లా డిక్టేట్ చెయ్యడం వలన వాటికి గొప్ప అంద
పట్టింది - మిల్టన్ డిక్టేట్ చేసినట్లనిపిస్తుంది. అలా చెప్పడంలో
వాటికి గొప్ప సౌందర్యం, బరువు, లోతు, వూపు, విశాలత్వం
లయ, సౌకుమార్యం, సహజత్వం వొచ్చాయి.

ఇవి అనువాదం అనిపించక పోవ
డమే వీటిలోని అందం అంటారు "కాన్క" గురించి ముచ్చటిస్తో - సౌరిస్.

# కాన్క

1. నీ రాజ్యాధికారాన్ని మాయం
...నిచ్చావు, షాజహాన్. ఒక ప్రణయాశ్రువుని అవి నాశనం
...చెయ్యాలని నీ కోర్కె.

మానవ హృదయంపై కాలానికి
...దయా లేదు. జ్ఞాపకం ఉంచుకోవాలనే విచార కరమైన
...ని యత్నాన్ని చూసి నవ్వుతుంది కాలం.

నువ్వు కాలాన్ని సౌందర్యంతో మరి
...చి బంధించావు. మాసిపోని ఆకారంతో నిరాకారుడైన
...మృత్యువుని కిరీటధారిని చేశావు.

రాత్రి నిశ్శబ్దంలో, నీ ప్రేయసి
...చెవిలో పలికిన రహస్యాన్ని, శాశ్వత పాషాణ మౌనంలో
...పొందించావు.

సామ్రాజ్యాలు పొడి పొడి అయి
...లినా, యుగాలు నీడల్లో మాయమైనా, చలువరాయి
...హృదయం ఈనాటికీ నాకు జ్ఞాపకమేనని నిట్టూరుస్తోంది.

నాకు జ్ఞాపకం వుంది-కాని జీవితం
...మరిచిపోతుంది. ఎందుకంటె అంతరహితమైన దాని నించి

ఆమెకి పిలుపు వొచ్చింది. ఏ భారాన్నీ అంగీకరించకండా, తన యాత్ర నిసాస్తుంది; ఒంటరివై పోయిన సుందర రూపాలకి తన జ్ఞాపకాన్ని వొదిలి.

2.

ప్రియా, నా తోట బాటలోకి రా!

నీ దృష్టిలో పడాలని తాపంతో తొక్కిసలాడే పూల పక్కనించి నడిచి ముందుకి వెళ్లు.

వెలుగులో ముంచుతో కూడా, అందర తప్పించుకునే సూర్యాస్తమయ అపురూప శోభమల్లె తళుక్కుమని మెరిసే ఆనందం దగ్గర ఆగు.

ప్రేమార్పణ అతి సుకుమారం, తన పేరు చెప్పుకోదు. దుమ్ములో హర్ష కంపనను వొదులుతో నీడ పైన మృదువుగా తేలి పోతుంది.

దాన్ని వేగంగా స్వీకరించలేక పోయినావా, అది ఎన్నటికీ దొరకదు.

కాని నువ్వు స్వీకరించి నిలుపుకో గల కాస్త మృదువైన పుష్పం, మిణుకుమంటో ఆరిపోయే జ్వాలా దీపం.

3.

నా తోటలోకి పళ్ళు గుంపులు, గుంపులుగా వొచ్చి పడతాయి. ఒకదాన్ని వొకటి తోసుకుంటాయి. అవి సంపూర్ణత చెందాలనే వేదనతో కాంతిలో పొంగి పడతాయి.



రాణీ, నా తోటలో గొప్పగా నీ [illegible] మోపు. నీడలో కూచుని తొడిమల నించి పళ్ళని [illegible]పని, వాటి మాధుర్య భారాన్ని చివరి బొట్టు వరకు, [illegible] పెదిమలవద్ద అర్పించుకోనీ.

నా తోటలో, సీతాచిలకలు ఎండలో [illegible]కలు విదిలిస్తాయి. ఆకులు కంపిస్తాయి. పూర్ణత చెంద[illegible]నికి పళ్ళు గోల పెడతాయి.

గడ్డిపువ్వు భూమికి దగ్గరైనట్టు [illegible] నా హృదయానికి చేరువ. అలిసిన దేహానికి నిద్రలాగ [illegible] మధురం ఆమె నాకు. లోతైన శాంతిలో పుష్కలంగా [illegible] కాలపు వరదలతో ప్రవహించే నదిమల్లే పొంగి పొరలే [illegible] జీతమే ఆమెపై, నా ప్రేమ. తన తరంగాలతో ప్రవా[illegible]ంతో గానంచేసే కొండవాగు గలగలమల్లే నా పాటలు [illegible] ప్రేమతో ఐక్యమైనాయి.

5. నక్షత్రాలన్నింటి తోటీ ఆకాశమూ [illegible]ంతులేని ఐశ్వర్యాలతో ప్రపంచమూ, అన్నీ నాకు వున్నా [illegible]ంకా కావాలని అడుగుతాను. ఈ భూమిలో మరీ చిన్న [illegible] కాస్త స్థలం వుంటే చాలు ఆమె నాదైతే.

6. ఏ మాత్రం లోభంలేని ఈ వసంత [illegible] శోభలో, నా కవీ, జాగుచేస్తో కూచోక ముందుకు వెళ్ళే [illegible]హూ, నవ్వుతో, పరిగెత్తుతో, తిరిగి వెనక్కి చూడనివారూ, కారణం లేకండానే ఓ గంట ఉల్లాసంగా వికసించి ఓ నిమి

షంలో ఏ పరితాపమూ లేకుండా మాయమయే వాడూ నీ సంగతి పాడు.

గతించిన నీ దుఖాశ్రువుల, హర్షా మోదాల జపమాలని తిప్పుతో, నిశ్శబ్దంగా కూచోకు. గతచిన రాత్రి రాలిన పూరేకుల్ని ఏరుకోడానికి ఆగకు. అందని వాటికోసం వెతుకుతూ, స్పష్టం కాని వాటి అర్థాన్ని తెలుసుకోవాలని చూస్తో సాగిపోకు నీ జీవితంలోని రసహీనమైన భాగాల్ని ఎక్కడ వుంటే అక్కడే వాటిని వొదిలెయ్యి; వాటి లోతుల్లోంచి గాంధర్వానుభవం పైకి పొంగేందుకు.

7

ఇప్పుడు మిగిలింది కొంచెమే. తక్కిందంతా, ఏ లక్ష్యంలేని ఓ ఎండాకాలపు ఘడియల్లో వ్యయమై పోయింది. ఓ పాటగా అల్లి, నీకు పాడడానికి అంతే మిగిలింది. పూలు దండగా కట్టి మృదువుగా నీ చేతుల్ని పట్టుకుని తొడగడానికి; ఎర్రని గుండ్రని ముత్యంతో సిగ్గుపడే రహస్యంవలె నీ చెవిని అలంకరించడానికి, ఓ సాయంకాలం; ఓ ఆటలో పందెం పూర్తిగా ఓడిపోవడానికి చాలినంతే మిగిలి పోయింది.

నా దోనె చాలా చిన్నది నాజూకయింది. వానలో పెద్ద అలల్ని దాటిపోవడానికి తగింది కాదు. నువ్వు దానిలోకి తేలికగా అడుగు పెట్టావా, నిన్ను నెమ్మదిగా అవతలి తీరపు రక్షణలోకి తీసుకుపోతాను; అక్కడ నల్లని నీళ్ళ తరగలు కలల కలత నిద్రల్లే వుంటాయి. అక్కడ నీటి మీదికి వొంగే కొమ్మల మీద



లో, మూలిగే గువ్వలు, మధ్యాహ్నపు నీడల్ని, యాచల్ని చేస్తాయి. దినమంతా గడిచిన తరవాత, నువ్వు అలసిపోయి నప్పుడు తడిసిన కలవను నీజుట్టులో అమర్చి, కలవకుంటాను.

8. నీకూ చోటు వుంది. కాసిని వరి కంకులు పట్టుకుని నుంచుని వున్నావు. నా పడవ నిండిపోయింది. దానినిండా బరువులు నింపారు. కాని నిన్నెట్లా తిరస్కరించి పంపెయ్యను.

నీ లేత శరీరం సన్నగా, ఊగిపోతోంది. నీ కనుకొలుకుల్లో వుండుండి మెరుస్తోంది చిరునవ్వు. వానమబ్బులా వుంది నీ చీర రంగు.

ప్రయాణికులు వారివారి రేవుల దగ్గర వారివారి యిళ్ళకి దిగిపోతారు. నా పడవకి ముందుగా, కాసేపు కూచుంటావు. నువ్వు దిగి పోవాల్సినప్పుడు నిన్ను ఆటంకపరిచే వారెవరూ వుండరు.

నువ్వు ఎక్కడికి వెళతావు? నీ కంకుల్ని ఎక్కడ పాతర వెయ్యడానికి ఏ ఇంటికి వెడతావు? అని నిన్ను ప్రశ్నించను. నేను తెరచాపలు దింపి నా పడవని కట్టేసినప్పుడు, సాయంత్రం కూచుని, నువ్వు ఎక్కడికి వెడతావో, ఏ ఇంట కంకుల్ని పాతర వేస్తావోనని ఆలోచిస్తాను.

9.

లలనా, నీ గంప బరువుగా వుంది
నీ దేహం అలసి పోయింది. ఏ దూరానికి ఏ లాభాని
కాంక్షతో బైలుదేరావు?

తెరువు దీర్ఘంగా వుంది. ఎండలో
దుమ్ము వేడిగా వుంది.

చూడు, కోనేరు లోతుగా నిండుగా
వుంది కాకి కన్నుమల్లె నీళ్ళు నల్లగా వున్నాయి. గట్లు లేత
పచ్చికతో మృదువుగా ఏటవాలుగా జారి పోతున్నాయి.

అలసిన నీ పాదాల్ని నీళ్ళలో
ముంచుకో. మధ్యాహ్నపు పవనుడు తన వేళ్ళతో నీ జుట్టుని
నిమురుతాడు. పావురాలు తమ నిద్రపాటల్ని జోలగా పాడ
తాయి. నీడల్లో దాక్కునే రహస్యాల్ని చెట్ల ఆకులు నీకు
గుసగుసలుగా పలుకుతాయి.

కాలం గడిచిపోయి, సూర్యా
స్తమయమైతేనేం? సద్దు మణిగే సంజ వెలుగులో తోవ కన
పడకపోతేనేం?

పుష్పించే గోరింట కంచె వెనక
కనబడుతోందే, అదే నా ఇల్లు. నీకు తోవ చూపిస్తాను. నీకు
ఓ పక్క వేసి, దీపం వెలిగిస్తాను.

ఉదయాన ఆవుల పాలు పితికే
చప్పుడికి పిట్టలు నిద్ర లేచినప్పుడు, నేను నిన్ను నిద్ర లేపు
తాను.

10

కనపడని మార్గాల సంచరించే ఈ
మధుపాలు, ఏ శక్తి వాటి నిలయాల నించి లాక్కుపోతోంది!



...లో ఎగిరే రెక్కలలో ఆ పిలుపేమిటి? విరుల ఆత్మలలో
...నే గానాన్ని అవి ఎట్లా వినగలుగుతాయి? నిశ్శబ్దంగా
...క్కనే తేనె గదులలోకి అవి ఎట్లా దారిని తెలుసు
...తాయి?

11. సముద్రం నించి తోటలోకి వొచ్చిన
...లో చెట్లు తొడిగిన నునులేత ఆకు మొగ్గలు, దక్షిణ
...వనంలో ఆకుల కదలికలూ, గలగలలూ మాత్రమే.
...ని సోమరి కూనిరాగాలు అంతే, వీటితో ముగిసింది ఆ
...

కాని కడలి వొంచన వున్న తోటలో
...మే వేసవిలో ప్రేమ పుష్పించాలి.

నాలో హర్షం వుద్భవించి చప్పట్లు
..., హొంగివచ్చే పాటలతో నృత్యంచేసి మధురమైన
...యంతో వుదయాన్ని కళ్ళు తెరిచేట్టు చెయ్యనీ.

12. ఎంతో కాలం కిందట ఓ వసంతమా,
...లు నందన వన దక్షిణ ద్వారం తెరిచి అవనీతల
ప్రథమ యవ్వనంలోకి దిగినప్పుడు, స్త్రీ పురుషులు ఉన్మా
...లో నవ్వుతో, నృత్యం చేస్తో, ఒకరిపై ఒకరు పూరజం
...ల్లుకుంటో ఇళ్ళనించి బైటికి పరిగెత్తుకు వొచ్చారు

ఆ చైత్రం మొదట్లో, నువ్వు నీ
...లో వెదచల్లిన ప్రసూనాల్నే ఏడాది తర్వాత ఏడాది
...చ్చి ప్రసాదిస్తున్నావు అందుకే అంతటా అల్లుకున్న

వాటి పరిమళాలతో ఇప్పుడు కలలై పోయిన దినాల నిట్టూర్పుల్ని అవి మాపై చల్లుతాయి. మాయమైన లోకాం దిగపడి పోయిన విరహ భావాల్ని, మనుష్య భాష నించి మాసిపోయిన ప్రేమ కథలతో నీ మృదు మారుతాలు నిండి వున్నాయి.

ప్రథమ ప్రణయంతో వూగిపోతు నా జీవితంలోకి నువ్వుఅద్భుతంగా ప్రవేశించావు, ఓ నాదు. మొదటి ఆకు పచ్చని నిమ్మ మొగ్గలలో దాక్కున్న మార్దవమైన సంతోషం ప్రతి సంవత్సరం ఆనాటినుంచి నన్ను చేరవొస్తోంది. నేను విశదం చెయ్యలేనిదంతా నీ ఎర్రగులాబీ పూలు, వాటి మండే మౌనంలో భరిస్తున్నాయి. ఆ విగా దినాల కవితా భావాల జ్ఞాపకాలు తిరిగి తిరిగి జన్మించే నీ కొత్త లేచిగుళ్ళ కంపనలో ధ్వనిస్తాయి.

13. ఉద్యాన వనంలో నిన్న రాత్రి పొంగి పొరలే నా యవ్వన మధువును నీకు అర్పించాను ఆ మధుపాత్రని, నువ్వు నీ పెదవులదగ్గిరికి తీసుకొని నీ కళ్ళని మూసుకుని చిరునవ్వునవ్వావు. నేను నీ ముసుకును తొలగించి, నీ వుంగరాల జుట్టు ముడివిప్పి, మౌనంతో, మధురమైన నీ ముఖాన్ని నా రొమ్ము మీదికి లాక్కున్నాను. నిద్రలో మునిగిన ప్రపంచాన్ని చంద్రుడు తన కలలతో ముంచెత్తిన గత నిశీథంలో.

ఇవాళ శిశిర శీతల ఉషా నిశ్శబ్దంలో స్నాతమై, తెల్లని చీర కట్టుకుని, చేతుల్లో పూల సజ్జతో



వ్వ ఈశ్వరాలయానికి వెడుతున్నావు: ఉషా నీరవంలో వారంలేని దాటుమీద, చెట్టునీడలో నేను వొదిగి న్నాను.

14. ఇవాళనేను ఆతురతపడుతోవుంటే యా, నన్ను క్షమించు.

ఎండాకాలపు మొదటివాన యివాళ పక్కన అడివి రెపరెప లాడుతోంది. పుష్పించిన కదంబ లు మధు పాత్రలని పరిమళంతో నింపి తోవన పోయే నార్ని ఆశ పెడుతున్నాయి. చూడు, ఆకాశం అన్ని ల నించి మెరుపులు, తీక్షణ వీక్షణాల్ని విసురు న్నాయి. నీ జుట్టులో పవనం అల్లరి చేస్తోంది.

ఇవాళ నేను నన్నునీకుసమర్పించు డానికి వొస్తే, ప్రియా, క్షమించు. సాధారణ ప్రపంచం, న మసకలో మరుగుపడ్డది. పల్లెలో ఎవరూ పని చెయ్యడం దు. బయళ్ళు నిర్జనంగా వున్నాయి. వర్షాగమనం, నీ నల్లని ళ్ళలో గానంగా రూపొందుతోంది. నీలి పమిటను ముసు వేసుకున్న నీ శిరోజాలకోసం ఆషాఢం, మల్లెపూలతో నీ ద్వారంవద్ద వేచివుంది.

15. పల్లెలో యిరుగు పొరుగు వాళ్ళు మె నల్లగా వుంటుందంటారు. కాని ఆమె నా హృదయా కి కలవ పువ్వు, అవును కలవే. తెల్లగా లేకపోయినా కలవ పువ్వే నాకు. ఆమెని నేను పొలాల మధ్య చూసినప్పుడు బ్బు ముసుకు వేసుకొచ్చింది వెలుగు. ఆమె తలపై పమిట

ముసుకులేదు. ఆమె అల్లుకున్న జడ మెడ మీద పొడుగా వేళ్ళాడుతోంది. పల్లెలో అనుకునేట్లు ఆమె నల్ల గానే వుండ వచ్చు. కాని నేను ఆమె నల్లని కళ్ళని చూసి సంతో షించాను.

గాలిలో స్పందనం తుఫానుని సూచిస్తోంది. చెదిరిన మచ్చల ఆవు అరుపు విని ఆమె యింటిలోకి పరిగెత్తింది. ఆమె విశాల నేత్రాల్ని ఓ క్షణం మబ్బులకేసి ఎత్తి; వొస్తున్న వాన చలనాన్ని తెలుసుకుంది. వరిపొలం పంచన నేను నుంచున్నాను. ఆమె నన్ను చూసి వుంటే, ఆ సంగతి ఆమెకే తెలియాలి.

ఎండాకాలపు వాన జల్లు సందేశం వలె ఆమె నల్లనిది. పుష్పించే అరణ్య భూముల ఛాయ మల్లె శ్యామలమయింది. వైశాఖ మాసపు కలవరపు రాత్రిలో అర్థంలేని ప్రేమతైన కోర్కెమల్లె నల్లగా వుంటుంది

16\. ఇక్కడ ఈ శిథిలమైన కోనేరు రేవు మెట్ల దగ్గిర ఆమె నివసించేది. ఎన్నో సాయంత్రాలు వెదురు ఆకుల మధ్య మత్తుగా వూగుతున్న చంద్రుడి వంక చూస్తో వుండేది. ఎన్నో వానరోజులు, వానలో తడిసిన నేల పరిమళం లేత వరి మొక్కల మీదిగా ఆమెను చేర వచ్చేది.

ఆ ఖర్జూర తోపుల మధ్య ఆమె ముద్దుపేరు అందరికీ తెలుసు.

చలికాలపు బొంతలు కుట్టుకుంటో కన్యలు కూచుని మాట్లాడుకునే ముంగిళ్ళలో కూడా ఆమె పేరు తెలుసు.



ఆ కొలను తన నీటిలో ఈత కొట్టిన ఆమె దేహాన్ని తన లోతుల్లో జ్ఞాపకం వుంచుకుంది. తడిసిన ఆమె పాదాలు ప్రతిరోజూ పల్లెకి పోయే తోవపైన గుర్తుల్ని చెరిగాయి.

నీళ్ళకి తమ బిందెల్ని పట్టుకుని వొచ్చిన వనితలు తమ సాధారణ పరియాచకాలకి ఆమె నవ్వడం చూశారు అనాడు ఎడ్లని స్నానానికి తీసుకు వెళ్ళే ముసలి కాపువాడు ప్రతిరోజూ యింటిముందు ఆమెని పలకరించడానికి ఆగేవాడు.

ఈ వూరు ముందు నించి ఎన్నో నావలు వెడుతో వుంటాయి. ఆ మర్రిచెట్టు నీడన ఎందరో యాత్రికులు సేద తీర్చుకుంటారు. ఎంతో మందిని సంతకి తీసుకు వెడుతో బల్ల కట్టు అవతలి రేవుకి తరచు వెడుతో వుంటుంది. పడిపోయిన మెట్లుకోనేరు పక్కనించి పోయే పల్లెబాటదగ్గిరే నివసించేది ఆమె. ఆ స్థలాన్ని యిప్పు డెవరూ గమనించరు. ఆమెనే నేను ప్రేమించేది.

17\. మేఘాలపై మెరుపులు తమ అగ్ని ముద్దుల్ని విసిరి, నవ్వుతో పరిగెత్తాయి. కవిమాత్రం ఓ మూల వృక్షాలతో, మేఘాలతో ఏకమై నుంచున్నాడు; తన హృదయాన్ని పుష్పంమల్లే మౌనంలో భద్రపరచి, చంద్ర వంక మల్లే తన కలలలోంచి అన్నీ కనిపెడుతో ఎండాకాలపు

సమీరంవలె ఏపీ పని లేకుండా తిరుగుతున్నాడు. ఫాల్గుణ సాయంత్రం సంధ్య లోతుల్లోంచి చంద్రుడు బుద్బుదంవలె పైకి లేచాడు. మొక్కకి నీళ్ళు పొయ్యడంలో నిమగ్నమయి వుంది ఒక కన్య. తన లేడిపిల్లకి మేత పెడుతోంది ఒకామె ఒకామె నెమలి చేత నాట్యం చేయిస్తోంది. ఆ సమయంలో కవిలోంచి గానం వెలువడింది. "ఈ లోకపు గూఢరహస్యాలు వినండి శశి ప్రేమతో కలవ పాలిపోయిందని నాకు తెలుసు. పద్మం ఉద్యత్ భానుడి ముందు తన ముసుకుని పక్కకి తీసుకుంటుందని నాకు తెలుసు. మీరు ఆలోచించారా కారణం చాలా సులభం. మొదటి మల్లె చెవులో మధుర ఝుంకార నాదానికి అర్థం విద్వాంసుడికి తెలీదు. కాని కవికి తెలుసు."

తెంజాయ మంటల్లో సూర్యుడు అస్తమించాడు తారాపతి చెట్ల వెనక ఆలిస్యంగా కదులుతున్నాడు. దక్షిణ మారుతం పద్మంతో రహస్యంగా పలికాడు' కవి కనపడేటంత వెర్రి వాడుకాడని, కన్యలూ, యువకులూ చప్పట్లు చరిచి పలికారు "ప్రపంచ రహస్యం బైటపడ్డది" అని వాళ్ళు ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుని పాడారు. "మనలోని రహస్యాన్ని కూడా నాలుగుదిక్కులా విసిరేద్దాము." అని.

8. నువ్వు నాకు నీ హృదయాన్ని ఇచ్చేవంటే నీ కాలం గొడవలతో నిండిపోతుంది. నాలుగు దార్లూ కలిసే చోట వుంది నా ఇల్లు. నా తలుపులు ఎప్పుడూ



...వుంటాయి. నా మనసు పరాయత్తమై వుంటుంది, ...పాటె నేను పాడుకుంటూ వుంటాను.

నువ్వు నీ హృదయాన్ని నాకు ...క తప్పకపోతే, దానికి నేను జవాబుదారీ కాను. ...నేను నీకు మాట యిస్తే, గానం మౌనంలో అంత ...ప్పుడు ఏదో ధ్యాసలో వుంటే, నువ్వు నన్ను ...వాలి; ఎందుకంటె వైశాఖంలో ఏర్పడిన నిబంధన ...కంలో వొదిలేశయ్యడం వుత్తము.

నీ హృదయాన్ని నాకిచ్చావా, ...గనే, తిరిగి తిరిగి జ్ఞాపకం చేసుకుంటూ వుండకు. ...లో నీ కళ్ళు పాడుతున్నప్పుడు, నీ కంఠస్వరంలోంచి ...అలలుగా చిందేప్పుడు నీ ప్రశ్నలకి నా ప్రత్యుత్తరాలు ...గోచరంగా వుంటాయి. సూటిగా సత్యానికి అంటి ...ని వుండవు. వాటిని ఎప్పటికీ నమ్మాలి. తరవాత ...లేకుండా మరచిపోవాలి.

యాభై ఏళ్ళు రాగానే మానవ ...అల్లకల్లోల ప్రపంచాన్ని వొదిలి, అరణ్య ఏకాంతానికి ...ని రాసి వుంది గ్రంథాల్లో. కానన ఆశ్రమం యువ్వ ...నని ఉద్ఘాటిస్తున్నాడు కవి. ఎందుకంటే అదే పువ్వుల ...వాసం. పక్షులూ మధుపాలూ విహరించేది అక్కడే. ...కాదు ప్రియుల గుసగుసల ప్రకంపనకోసం నిభృత ...లాలు కాచుకుని వుంటాయి అక్కడే మాలతీ పుష్పా ...కొకొక ముద్దు అన్నట్లు వెన్నెల, గాఢమైన సందే

శాన్ని అనుగ్రహిస్తుంది; కాని ఆ సందేశం అర్థం చేసే కలిగిన వారు యవ్వనులే.

పాపం యువకులకి అను లేదు. చెప్పిన మాట వినరు. కనక సంసార వ్యవహారా ముసలి వారే చూసుకోవాలి. కుర్రవాళ్ళ గహనచ్ఛా ఏకాంతంలోకి వెళ్ళి ప్రణయ కర్కశ శిక్షణలో నిమగ్న కావాలి.

20.

నీకు విలవ ఎక్కడ? నా పాటని అడిగాను. ఎండా కాలపు దక్షిణ సమీరా నశ్యంతో పండితులు మురికి చేస్తారే అక్కడేనా?

నూనె పాత్రకి ఆధారమా, పాత్ర నూనెకి ఆధారమా అని అంతు లేకండా తర్కిస్తో వుంటా అక్కడా? వేగంగా పరిగెత్తే జీవితపు సరదాల పైన ప పోయిన పురాతన రాత గ్రంథాలు మండి పడే చోట వుంటావ నువ్వు? అని అడిగాను. "కాదు,కాదు. వొప్పుకోను." అంది నా పాట.

ఐతే నీకు ఎక్కడ విలవనిస్తారు? భాగ్యవంతుడు తన పాలరాతి మందిరంలో అహంభావంతో, లా వెక్కి; తుళ్ళిపడతాడే అక్కడ విలువైన చర్మాలతో అట్ట వేసి వాటిపేర్లు బంగారు అక్షరాలతో చిత్రించిన పుస్తకాల్ని, బానిసలు దుమ్ము దులుపుతో, ఏ అనామక దేవతకో అంకి తమై ఎవరూ ఎన్నడూ చదవని పుస్తకాలు అలమార్లని అలంకరిస్తాయే.



వుండడం, యిష్టమా నీకు?"

అక్కడ వుండను" అంది నా పాట.

లో తల

యవ్వన స్వప్న లోకాలలో

న్న బల్ల మీద దిక్కు లేకండా పడివున్న వచనం,

యంలో దాక్కుని కవిత

కొట్టిన చీదర

ర్థి చుట్టూ దోబూచులాడతావా అని అడిగాను నా న్ని.

బెరుకు బెరుకుగా తడబడుతో నా మౌనంగా వుండి పోయింది.

ఇంటి పనులు చేసుకుంటో, కొంచెం సం దొరకగానే పడక గదిలోకి పరిగెత్తి, తన జుట్టుతో చే, పిల్ల నలిపేసిన కథల పుస్తకాన్ని దిళ్ళ కింద పైకి లాగే కొత్త పెళ్ళికూతురు దగ్గిర వుండడం ఇష్ట మా నీకు?

నా పాట ఓ నిట్టూర్పు విడిచి ద్యుంగాని కోర్కెతో వూగిసలాడుతోంది.

పక్షుల ఏ చిన్న రుతాన్నీ గౌరవించ నా వొదలరో.

ఎక్కడ ఏటి ముద్దు పలుకు
పూర్తి అర్థం కనపడుతుందో.

లోకంలోని అన్ని వీణారవాలు
కంపించే రెండు హృదయాలపై తమ గాంధర్వా
వర్షిస్తాయో,

అక్కడ నీ నివాసం ఏర్పరు
కుంటావా? అవునవును అంటో నిలవలేక అరిచింది నా ప్రా

21.

జీవిత ప్రారంభోదయం గా
ముందే నువ్వు ఆనందమయ స్వప్న జలపాతం
నుంచుని దాని ద్రవ ఉధృతంలో నీ రక్తాన్ని నింపుకున్నా
వనుకుంటాను, ప్రియా!

ఒక వేళ నువ్వు నందన
వీధుల్లో విహరించి వొచ్చేవేమో! అక్కడ మల్లెలూ,
వకాలు, కరవీరాలు, గంతులేసే పుష్ప సముచ్చయం
చేతుల్లోకి గుంపుల గుత్తులుగా నీ హృదయంలో ప్రవేశిం
గంతులేస్తున్నాయేమో!

రాగాల రొదలో మాటలు మునిగి
పోయిన పాట, అదృశ్య పుష్ప పరిమళ హర్షం నీ నవ్వు

నీ హృదయంలో దాగి
జ్యోత్స్నవతి నించి నీ అధర గవాక్షంగుండా,
వెన్నెల మల్లె వుంటుంది నీ నవ్వు.

నేను హేతువేమిటని అడగను
కారణం మరచి పోతాను, హొంగి పొరలి విరుచుకు పడే
జీవిత సంరంభమే నీ నవ్వు అని మాత్రం తెలుసు నాకు



22.

ఆనంద మయమైన ఏ భవిష్యత్తు
నో, నేను గొల్ల పిల్లవాడిగా బృందావనంలో పుడితే
లు, మా వంశంలో సంస్కృతి నశించడానికి సంతోషంగా
అంగీకరిస్తాను.

గొల్లపిల్లవాడు మర్రిచెట్టు కింద
మని పశువుల్ని మేపుతో రాధామనోహర పువ్వుల్ని
లేకండా మాలల్లుతాడు. యమునానది నల్లని లోతు
ల్లో మునగడం, కొట్టు కోవడం అతనికి సరదా.

ఉదయం కాగానే, మేలుకోమని తన
ల్ని పిలుస్తాడు. ఆ వీధి ఇళ్ళన్నీ కవ్వాల శబ్దంతో
గాలు తీస్తాయి. పశువుల నించి ధూళి లేస్తుంది. పాలు
కడానికి దొడ్లలోకి వొస్తారు కన్యలు.

తమాల వృక్షాలకింద నీడలు చిక్క
తో వుంటాయి. నది వొడ్డున చీకట్లు అలుముకుంటాయి.
గే నీటిని దాటుతో గొల్ల పడుచులు భయంతో వొణుకు
తారు. పురి విప్పుకుని అరిచే నెమళ్ళు అడివిలో నాట్యం
చేస్తాయి. ఆ గొల్ల పిల్లవాడు ఎండాకాలపు మబ్బుల వొంక
చూస్తో కూచుని వుంటాడు.

కొత్తగా విచ్చిన పువ్వుమల్లే చైత్ర
మాసపు రాత్రి మధురంగా వుంటుంది. జుట్టులో నెమలి
ఈకని గుచ్చుకుని అడివిలో మాయమౌతాడు. చెట్టు
కొమ్మల మీది పువ్వుల్ని ఉయ్యాల తాళ్ళకి అల్లుతాడు
దక్షిణ మారుతం, గానంతో పులకరిస్తుంది నీలపు నది
ఒడ్డున గుంపుకూడతారు; సంతోషంగా గొల్ల పిల్లవాళ్ళు.

ఎక్కడ పాలని కన్యలు చిలుకు
తారో అక్కడ, ఆ తమాల వృక్ష ఛాయా మయ బృందావన
గ్రామంలో నేనే పుట్టడానికి పిలుంటే—

సోదరులారా, ఈ నవ వంగ, నవీన
యుగానికి నాయకుణ్ణి ఎన్నటికీ కాను. చీకట్లో వెళ్ళే వారి
కోసం సాంస్కృతిక దీపాన్ని వెలిగించడానికి ఆశ పడను.

23. ఆ ఇసిక వొడ్డు అంటే నాకు
మక్కువ. అక్కడ ఏ సంచారమూ లేని నీటి గుంటలలో
బాతులు గోల చేస్తాయి. తాబేళ్ళు ఎండలో వెచ్చగా పడు
కుంటాయి. నిడుపు గడ్డి నీడలో పల్లెవాళ్ళ దోనెలు సాయం
త్రాన ఆశ్రయం తీసుకుంటాయి.

వెదురు పొదల బాహువుల్లో నీడలు
చేరుకుంటాయే, అక్కడ ఆ అడివి తీరమంటే నీకు ప్రేమ.

పంకర్లు తిరిగే బాటలోంచి బిందెలు
పట్టుకుని వనితలు వొస్తారు అక్కడికి.

రెండు తీరాలకి అదేపాటపాడుతో,
అదే నది మన మధ్య ప్రవహించింది.

నక్షత్రాల కింద ఇసికలోవొక్కడ్నీ
పడుకుని ఆ పాట విన్నాను గట్టు కొసన ఏటవాలులో
కూచుని తెల్లారకట్ట వెలుగులో విన్నావు: నువ్వు ఆ పాటనే,
ఆ పాట నించి నేను విన్నమాటలు నీకు తెలీవు.

ఆ పాట నీకు వినిపించిన రహస్యం
నాకు ఎన్నటికీ మర్మంగానే వుండి పోయింది.



నీ కిటికీ సగం తెరిచి, ముసుకు
...వరకు పైకెత్తి తన సరుకులతో వొచ్చే గాజుల బత్తుని
...చూస్తో నువ్వు నుంచుని వున్నావు. దుమ్ము బాట
...పోతే బరువుగా కిర్రుమనే బండిని, దూరంగా వున్న
...తో ఆకాశపు అంచున నెమ్మదిగా కదిలే తెరచాప
...ని, నువ్వు సోమరిగా చూస్తో వున్నావు.

పొందిక లేని మనో చిత్రాలతో
...న అర్థంలేని పాటలు పాడుతో రాట్నం తిప్పే
...మ్మ రాగాల మల్లె కనపడుతుంది నీకు ప్రపంచం.
...సరుకులతో, ఈ గాలి ఆడని సోమరి మధ్యాహ్నం ఆ
...చితుడు బైలుదేరి వొస్తున్నాడేమో మరి.

స్పష్టమైన తన అరుపుతో,నీ తలుపు
...ందు నించే వెడతాడు. నీ కిటికీని ఒక్కవూపులో
...వేస్తావు నీ ముసుగుని లాగి అవతల పారేస్తావు. నీ
...మసకలోంచి బైటికి వొచ్చి నీ భవిష్యత్తుని కలుసు
కుంటావు.

25. నీ చేతుల్ని గట్టిగా పట్టుకున్నాను.
నా హృదయం నీ కళ్ళ నలుపు లోతుల్లోకి మునుగుతోంది.
...టల వెనక, మౌనం వెనక నన్ను ఎన్నటికీ తప్పించుకునే
...న్ను వెతుకుతూ.

కాని నాకుతెలుసు.చిక్కకదోబూచు
...డే నీ విలాసాలతో నా ప్రేమ తృప్తి పడాలని.

ఎందుకంటె నాలుగుబాటలూకలిసే
...ట మనం కలుసుకున్నాము, ఒక క్షణం.

లెక్కలేని ఈ లోకాలగుండా, ఈ మార్గాల వ్యూహాల్లోంచి నిన్ను జాగ్రత్తగా తీసుకు పోయే శక్తి నాకు వుందా? మృత్యు గహ్వరాలు మింగ చూసే చీకటి మార్గాన నిన్ను నిలుపుకోగల త్రాణ నాలో వుందా!

26

ఎందు చేతనన్నా నువ్వు నన్ను తలుచుకుంటే, వర్ష సాయంత్రం తన నీడల్ని నది మీదికి వొదిలినప్పుడు తన మసక వెలుగును పడమటి దిశకు మెల్లగా లాక్కునేప్పుడు నేను నీకు పాడతాను. పగటి శేష భాగం పనికిగాని, ఆటకిగాని పనికిరానంత యిరుకుగా వుంటుంది అప్పుడు.

నీ దక్షిణ ప్రాంగణంలో నువ్వు కూచుని వుంటావు. వెలుతురు లేని గదిలోంచి పాడతాను నేను. దట్టమయ్యే చీకట్లో తడి ఆకుల వాసన కిటికీలోంచి లోపలికి వొస్తుంది. కొబ్బరి తోపులో తుఫాను పవనాలు గంద్రగోళం చేస్తాయి

వెలిగించిన దీపం గదిలోకి తెచ్చినప్పుడు నేను వెళ్ళిపోతాను. అప్పుడు బహుశా రాత్రి లోకి వింటావు. నేను పాడనప్పుడు నా పాట వింటావేమో!

27.

నాకున్నదంతటినీ పళ్ళెం నిండా నింపి నీ కిచ్చాను. రేపు నీ పాదాల దగ్గిరికి ఏం తీసుకు రావాలా అని యోచిస్తున్నాను పుష్ప భరితమైన వేసవి చివరలో, తన పువ్వుల్ని రాల్చేసి నగ్నంగా తన కొమ్మల్ని పైకెత్తి ఆకాశం వంక చూసే వృక్షం మల్లే వున్నాను.



ఇదివరకు నేను నీ కిచ్చిన కానుకలో, అశ్రువులతో శాశ్వతత్వాన్ని పొంది నశించని పువ్వొక్కటి కూడా లేదా? వసంత చివర శలవ తీసుకుంటో రిక్త హస్తాలతో నీ ముందు నిలుచున్నప్పుడు దాన్ని జ్ఞాపక ముంచుకుని నీ కళ్ళతో నన్ను మెచ్చు కుంటావా?

28.

ఆమె స్పర్శ గానాన్ని వినిపిస్తో ఆమె వేళ్ళతో నా జుట్టుని ముద్దుగా నిమురుతో నా తల దగ్గిర కూచుందని కల కన్నాను.

నా కన్నీళ్ళని ఆపుకోడానికి తంటాలు పడుతో ఆమె ముఖం వంక చూశాను. పైకిరాని మాటల వ్యథ నా నిద్రని బుద్బుదం వలె బద్దలు చేసింది.

నేను లేచి కూచున్నాను. మండి పోతున్న ఓ సిరప ప్రపంచం వంటి ఆకసపు క్షీర వాహినీ కాంతి వంక చూశాను. ఈ క్షణాన ఆమె కూడా నా కలతో, శ్రుతి పలికే కలని కంటుందేమోనని ఆశతో ఆలోచించాను.

29

కంచె మీదిగా కళ్ళు కలుసుకున్నప్పుడు, ఆమెకి నేనేదో చెప్పాలనుకున్నాను. కాని ఆమె వెళ్ళి పోయింది. కాల తరంగాల మీద పడవ మల్లే వూగుతోంది, నేను ఆమెకి చెప్పాలనుకున్న ఆ మాట.

అది అంతంలేని అన్వేషణలో శరత్ మేఘాలపై తేలి పోతున్నట్టుగా వుంది; సూర్యాస్తమయంలో తన చివరి నిమిషాన్ని వెతుక్కుంటో.

నిరాశ ముసకలో తన అర్థాన్ని కనుక్కోడానికి, నా హృదయంలో మిణుగురుల వల్లె మిణుకు మిణుకు మంటోంది, ఆమెకి నేను చెప్పాలనుకున్న మాట.

30.

వసంత పుష్పాలు, నీరవ ప్రణయ ఉధృత వ్యథమల్లే విరుచుకు పడుతున్నాయి. వాటి శ్వాసతో నాలో పాత కాలపు పాటల జ్ఞాపకాలు రేగుతున్నాయి. అకస్మాత్తుగా, నా హృదయం నవ కోమల పల్లవాల్ని తొడిగింది. నా ప్రియాంగన రాలేదు. కాని ఆమె స్పర్శ నా దేహమంతటా నిలిచి వుంది. పరిమళించే పొలాల మీదిగా ఆమె కంఠం వినవస్తోంది. ఆకాశ విషాద అగాధాలలో ఆమె చూపు కనపడుతుంది. కాని ఆమె నేత్రాలేవీ? ఆమె ముద్దులు గాలిలో తేలి పోతున్నాయి. కాని ఆమె పెదవులేవీ?

31.

నా పువ్వులు, పాలమల్లె, తేనెమల్లె మదీరామల్లె వుండేవి. ఓ బంగారు తాడుతో వాటిని గుచ్ఛంగా కట్టాను. ఎంత జాగ్రత్తగా కనిపెట్టి చూసినా, పాలిపోయినాయి. ఆ తాడు మాత్రమే మిగిలి పోయింది.

నా పాటలు పాలూ, తేనె, మధువు వలె వుండేవి. స్పందించే నా హృదయపు లయలో నిలిచి పోయాయి అవి. కాని అవి రెక్కలు చాచి ఎగిరి పోయాయి. సోమరి గడియల ముద్దు బిడ్డలవి. నా హృదయం నిశ్శబ్దంలో ధ్వనిస్తోంది.



నేను ప్రేమించిన సుందరి, పాలమల్లె, తేనెమల్లె, మధువు మల్లె వుండేది. ఆమె పెదవులు తొలిజిమ మెరుపు. ఆమె కళ్ళు మధుపాల వలె నలుపు. ఆమెని ఉలిక్కి పడవేస్తుందేమోనని నా హృదయాన్ని నిశ్శబ్దం చేసుకున్నాను. కాని నా పువ్వుల మల్లె నా పాటల మల్లె తప్పించుకు పోయింది. నా ప్రేమ వొంటరిగా నిలిచి పోయింది.

32.

వసంత దినం తలుపు తట్టినప్పుడు పొరపాట్లు, పనిలో నిమగ్నుణ్ణై వున్నాను. నువ్వు బదులు పలకలేదు. కాని యిప్పుడు నేను వొంటరినైపోయి, హృదయం వ్యథలోపడేప్పుడు, వసంత దినం తిరిగి వచ్చింది. అతన్ని పొమ్మనిచెప్పడం ఎట్లాగో తెలీడం లేదు.

అతను మనపై ఆనందాభిషేకం చెయ్యాలని వొచ్చినప్పుడు మన తలుపు మూసి వుంది. కాని ఇప్పుడు వ్యసన పరిధానంతో వొచ్చాడు. తలుపు తీసే వుండాలి.

33.

ఏదీ లెక్క చెయ్యని గులాబి పూలతో, కొత్తగా చిగిర్చిన అశోక కిసలయముల ఎర్రని బుస్సుతో ఆకాశాన్ని మంటలు పెడుతో, నవ్వుల ఐశ్వర్యంతో నా జీవితంలోకి ఓ నాడు ప్రవేశించిన వసంతం.

ఇప్పుడు, ఈనాడు, నా వొంటరి జీవనంలోకి దొంగ చాటుగా నిర్మానుష్యమైన దారులగుండా.

నిశ్శబ్దంతో బరువెక్కిన నీడల గుండా ప్రవేశించి.

వెల వెలబోయే ఆకాశంలో హరిత వర్షం అలిసి మూర్చిల్లే పృథ్వి మీద నా ప్రాంగణంలో కూచుని పొలాల మీదిగా చూస్తోంది.

34. కిందికి వేళ్ళాడే వర్ష మేఘంమల్లె మనం విడిపోయే నిమిషం తటస్థించినప్పుడు, నా చేతుల వొణుకుతో నీ మణికట్టుకి ఎర్రని తోరాన్ని కట్టడానికి మాత్రమే నాకు వ్యవధి వుండి పోయింది. ఇవాళ యిప్ప పువ్వుల కాలంలో నేను పచ్చికమీద కూచున్నప్పుడు నీచేతికి నేను కట్టిన తోరాన్ని యింకా నీతో వుంచుకున్నావా అన్న వొక్క ప్రశ్నే నా మనసులో.

పుష్పించే జనప పొలం పక్కనించి వెళ్ళే సన్నని దారి మీదికి వెళ్లావు. నిన్న రాత్రి నేను నీ జుట్టులో పెట్టిన పూలదండ వాడులుగా అక్కడే వేళ్ళా తో వుండడం చూశాను. నా చివరి కానుకగా ఇయ్య నికి పొద్దున్నే కొత్త పూలు ఏరి తెచ్చిందాకా, నువ్వు ందుకు ఆగలేదు? నీకు తెలీకుండానే మధ్య తోవలో పడి లేదు కదా, అని ఆలోచిస్తాను, నీ జుట్టునించి వాడులుగా ళ్ళాడే పూలదండ.

ఉదయం, సాయంత్రం నీకు ఎన్నో టలు పాడాను నువ్వు వెళ్ళి పోయినప్పుడు నా చివరి టని నీ కంఠంలో తీసుకు పోయినావు. నీ కోసం త్రమే ఎన్నటికీ నాలో వున్న పాడని పాటని వినడానికి వ్వు నిదానించి వుండి పోలేదు. పొలం లోంచి నడుస్తో,



కంఠంలో పాడుకుంటో వెళ్ళిన పాట, నీకు విను వ లేదు కదా చివరికి అని యోచిస్తాను.

నిన్న రాత్రి మబ్బులు భయపెడు యి: గాఢంగా వీచే గాలికి వశమై, ఉసిరి కొమ్మలు కుతున్నాయి. వానతో, ధ్వనించే ఆ ఒంటరి రాత్రిలో నన్ను చేర వొస్తే, అవి నా ప్రియాంగన రూపంలో యని ఆశ పడ్డాను.

పొలాలగుండా గాలులు ఇంకా బుగుతున్నాయి. కన్నీటితో తడిసిన ఉషాకపోలాలు వెల పోతున్నాయి నా కలలు వ్యర్థమైనాయి. ఎందు కే నిజం కఠిన మయింది. కలలు కూడా తమ స్వంత సంలోనే నడుస్తాయి.

నిన్న రాత్రి చీకటి, తుఫానులో స్సే తాగినప్పుడు; రాత్రి వేసుకున్న ముసుకువలె గాలిలో చీలికలైనప్పుడు, వానతో శబ్దించే, నక్షత్రాలు రాత్రిలో, నాప్రియాంగన రూపంలో అసత్యం నావద్దకు స్తే, సత్యానికి ఈర్ష్య కలుగుతుందా?

6. నా బంధాలూ, నా హృదయంలో గానం చేశాడు. దినమంతా మీతో ఆడుకున్నాను. మిమ్మల్ని నేను భూషణంగా కూడా ధరించాను. మనం మిత్రులమైనాము. మిమ్మల్ని చూసి భయపడ్డ సమ లు కూడా వుండేవి. కాని నా భయంవల్ల మిమ్మల్ని

మరింత ప్రేమించాను. దీర్ఘమైన నా చీకటి రాత్రులలో మీరు నా సహచరులై వుండేవారు. నేను మీ నించి సెల తీసుకునే ముందు మీకు నమస్కరిస్తున్నాను.

37. నా నావా, నీ చుక్కాని ఎన్నో సార్లు విరిగింది. నీ తెరచాపలు చీలికలుగా చిరిగి పోయాయి. చాలా సార్లు నువ్వు లంగర్ని ఊడ్చుకుంటో సముద్రం వేపు లెక్కచెయ్యకండా కొట్టుకుపోయినావు. కాని ఇప్పుడు నీ అడుగు భాగం, పగిలి నీళ్ళతో బరువెక్కింది. ఇంక నీ ప్రయాణాలు చాలించే సమయమయింది. ఒడ్డున కొట్టుకునే నీళ్ళు నీకు జోలపాట పాడుతో వుంటే, హాయిగా నిద్ర పో.

కాని నాకు తెలుసు, ఏం చెప్పి ప్రయోజనం లేదని. ముసుకు వేసుకున్న అంధకార వినాసపు ముఖం నిన్ను మరగించి పిలుస్తోంది. తుఫానులలల వున్మాదం నిన్నావరించింది. ముందుకు పొంగి వొచ్చే సముద్రగానం పైకి లేస్తోంది. ఆ నాట్యపు తాపంతో నువ్వు వదిలి పోతున్నావు. సరే, నీ గొలుసు తెంచుకుని, నా నావా, స్వేచ్ఛగా నిర్భయంగా, వేగంగా పోయి పగిలిపో.

8. నేను యవ్వనంలో వున్నప్పుడు, ంగా, వేగంగా, ప్రవాహంలో కొట్టుకు పోయేవాణ్ని. ంత మారుతం తనకున్నదంతా వెదచల్లుకునేది. చెట్లు పుష్పాలతో వెలిగిపోయేవి. పక్షులు పాటలతో నిద్రపోయేవి వు.



పొంగే నాలోని ఉద్వేగంలో పడి, తిరిగే వేగంతో, పయనించాను. నిదానించి చూడడానికి, గాన్ని నాలోకి తీసుకోడానికి, అనుభవించడానికి వ్యవధి వుండేది కాదు. నన్ను వొడ్డున వదిలేసి, యవ్వన ప్రవాహం తగ్గేటప్పటికి, అన్నిటి లోతైన గానం వినగలుగుతున్నాను. న నక్షత్ర హృదయాన్ని ఆకాశం నా ముందు తెరిచింది.

39. నా కళ్ళ వెనక కూచుని అన్నిటినీ చూసే వాడొకడున్నాడు. యుగాలుగా ఎన్నిటినో చూచినట్టున్నాడు అతను. జ్ఞాపకాల తీరాల అవతలి లోకాన్ని చూసినట్టున్నాడు. ఆ మరచి పోయిన దృశ్యాలు పచ్చిక పైన మెరుస్తాయి. ఆకులమీద కంపిస్తాయి. పేరులేని, నక్షత్రాల సంధ్య వెలుగుల సమయాల్లో ఏకైక ప్రియావదనాన్ని అనేక కొత్త మేలిముసుకుల కింద చూశాడు. కనక అసంఖ్యాక కలయికలతో, ఎడబాటులతో అతని ఆకాశం బాధాభరితమయింది. ఈ వసంత మృదువనం వేదనావృతమయింది. అది నెరగని యుగాల రహస్య భాషా ధ్వనులతో బరువెక్కిన వేదన అది.

40. మాయమైన నా యవ్వన కాలం నించి నాకో సందేశం వొచ్చింది. ఇంకా ఉదయించని వైశాఖ పరికంపనల్లో, నీ కోసం కాచుకుని వున్నాను అక్కడ కన్నీటికై చిరు నవ్వులు ఫలిస్తాయి. ఇంకా పాడని పాటలతో ఘడియలు వేదన పడతాయి. వయసు అనే అరిగి

పోయిన మార్గంమీద మృత్యుద్వారంగుండా నా దగ్గిరికి రా. ఎందుకంటే, కలలు మాయమౌతాయి ఆశలు అణిగి పోతాయి. సంవత్సరమంతా కూడబెట్టుకున్న ఫలితాలు పాడైపోతాయి. కాని నేను మాత్రం శాశ్వత నిత్యసత్యాన్ని. తీరంనించి తీరానికి పయనించే నీ జీవిత యాత్రలో, నువ్వు నన్ను తిరిగి తిరిగి కలుసుకుంటావు.

41. నది నించి నీళ్ళు తెచ్చుకోడానికి బైలుదేరారు పడుచులు—చెట్లలోంచి వాళ్ళ నవ్వులు విన వొస్తున్నాయి. బాటలో వాళ్ళని కలుసుకోవాలని మనసు పడుతున్నాను. అక్కడ నీడలో మేకలు గడ్డి మేస్తో వుంటాయి. కింద పడ్డ ఆకుల మీదనించి ఉడతలు, ఎండ లోంచి నీడలోకి గంతులేస్తాయి.

కాని, ఈరోజు నేను చెయ్యవలసిన పనిని చేసేశాను. నా అండాలు నింపాను. నేను నా తలుపు దగ్గిర నుంచుని పోక చెట్ల ఆకుల మీద మెరిసే, ఆకుపచ్చని రంగుని చూస్తో, నది నించి నీళ్ళు తేవడానికి వెళ్ళే ఆడవాళ్ళ నవ్వుని వింటో వుంటాను. మంచులో తడిసిన ప్రభాత నవ్యతలో, అలిసిన అస్తమయ కాంతిలో నిండిన నా ఖిందె బరువుని ప్రతి రోజూ మొయ్యడం నాకు యిష్టంగా వుంటుంది.

నా మనసు సోమరిగా వున్న సమయాల్లో, దాని గల గలమనే నీళ్ళు నాతో ముద్దు మాటలు మాట్లాడేవి. నా సంతోషపు ఆలోచనల సడితేని నవ్వుతో



...నవ్వేవి. నేను విచారంగా వున్నప్పుడు. అవి కన్నీళ్ళ ...తో నా హృదయంలో మాట్లాడేవి. పావురాల ...బగులు వాన చప్పుడు వినబడకండా చేసేటప్పుడు ఆ ...ను రోజుల్లో నీళ్ళ ఖిందెని మోశాను.

నేను ఇవాళ చెయ్యవలసిన పనిని ...ను. జాడీల్ని నింపాను. పడమట కాంతి తగ్గి పోతోంది. ... కింద నీడలు చేరుకుంటున్నాయి. అవిసి తోటల నించి ...ర్పు వినవొస్తోంది. గ్రామంలోంచి నల్లని నదివేపుపోయే ... వెంట వెడుతున్నాయి నా వాంఛాయుత నేత్రాలు.

...2. నువ్వు ఉత్తచిత్ర పటానివి మాత్ర ...? ఆ నక్షత్రాలంత వాస్తవం కాదా? ఈ మట్టిమల్లె ...గా నిజం కాదా? ప్రతిదాని నాడీ చలనంతోనూ, స్పంది ...యి అవి. చిత్రించిన ఆకారపు నిశ్చలత్వంలో నువ్వు ... ఎడంగా వుంటావు.

వెచ్చని వూపిరితో నీ అవయవాల ...న రాగంతో నువ్వు నా పక్కన నడిచిన రోజులుండేవి.

నీ కంఠ రవంలో నా ప్రపంచపు ...క్కు రూపొందింది. నీ ముఖంలోంచి బైట ప్రపంచం నా ...దయాన్ని తాకింది. అనంతత్వపు ఛాయల్లో నువ్వు ...స్మాత్తుగా నిలిచి పోయినావు. నేను వొంటరిగా ముందుకు ...కాను. పిల్లవాడి మల్లె నవ్వుతో జీవితం చావు గిలకను ...స్తో పరిగెత్తుతోంది. నిన్ను వెంట రమ్మని పిలుస్తుంది. ...ను అగోచరమైన దాని వెంట వెడుతున్నాను. ఆ

నక్షత్రాల వెనకా, దుమ్ము వెనకా ఎక్కడ ఆగిపోయినావో అక్కడే నుంచుని వున్నావు. నువ్వు వుత్త చిత్రానివి మాత్రమే కాదు, వీల్లేదు.

నీలో జీవిత ప్రవాహం పూర్తిగా ఆగిపోతే, అది నదీ ప్రవాహాన్ని ఆపుతుంది. వర్ణ వైచిత్రి యాల ఉషా ఆగమనాన్ని ఆపేస్తుంది. ఎక్కడా ఆశనెరగని అంధకారంలోని, శిరోజాల నలుపు మెరుగు మాయమైతే, తన స్వప్నాలతో సహా వసంతోత్సవ అరణ్య ఛాయలు మరణిస్తాయి.

నేను నిన్ను మరిచిపోయాననేది నిజమౌతుందా? బాట పక్కన కంచె మీది పువ్వుల్ని మరిచి ఆలోచన లేకుండా ముందుకు తొందరగా నడుస్తాము. అయినా మన మరపులోకి గుర్తు లేకుండానే వాటి ధ్యాస తగులుతోనే వుంటుంది; మన జ్ఞాపకాల్ని సంగీతంతో నింపుతో, నా బతుకు మొదట్లో స్థానమేర్పరుచుకోడానికి, నా లోకం నించి కదిలి పోయినావు. అయినా, తన లోతుల్లో దారి తప్పిన జ్ఞాపకాన్ని మరిచి పోవడమంటావా?

నువ్వు నా పాటల ఎదుట లేవు. వాటితో ఏకమైనావు. ఉషా ప్రథమకిరణంతో వొచ్చావు నా దగ్గిరికి. సాయంకాలపు చివరి స్వర్ణ ఛాయలో నిన్ను పోగొట్టుకున్నాను.

ఆనాటినించి, చీకట్లో నిన్ను కలుసుకుంటూనే వున్నాను. కాదు, నువ్వు చిత్రానివి ఏ మాత్రం కాదు.



నువ్వు చచ్చిపోయి నిరవద్యత్వ ...క నిస్పృహని నా జీవితంలో వొదిలి వెళ్ళావు. నీ ...ణ సూర్యాస్తమయ వర్ణాలతో, నా ఆలోచనా ...ంచలాన్ని చిత్రించింది ఈ ప్రపంచం మీదిగా ప్రేమ ...నికి కన్నీళ్ళ చారని వొదులుతో నీ ప్రియబాహు ...ంగ వివాహబంధంలో, మిలనమైనాయి, నా జనన ...ణాలు నాలో.

సమస్త ఆది అంతాలు ఎక్కడ ...తామో, ఆ ప్రాంగణంలో, దీపం వెలిగించుకుని, ...వ్వు కాచుకుని వుండడం నేను వూహించుకోగలను. నీవు ...చిన తలుపుల్లోంచి, నా లోకం, ఇక్కడ నించి వెళ్ళి ...యింది. నీ జీవితంతో మరణ పాత్రని నింపి, నా పెదవుల ...దించావు.

44\. నీ మృతిలో నువ్వు నా నించి ...వల వున్న వాటి అన్నింటికీ చచ్చిపోయినావు. ప్రపంచంలో వున్న వాటి నన్నింటినించీ మాయమై నా ...క్కంలో పూర్తిగా పునర్జన్మను పొందావు. నా జీవితం ...వ రహిత సంపూర్ణతను పొందినట్లుగా తోచింది. స్త్రీ, పురుషులు నాలో శాశ్వతంగా ఏకమైనారనిపించింది.

45\. నువ్వు బతికివున్నప్పుడు నా ఇంటిని ఎట్లా శుభ్రం చేసి సద్ది వుంచే దానివో, లలనా, అట్లానే, నా వొంటరి బతుకు లోకి అందాన్నీ, క్రమాన్నీ, తీసుకురా.

